'ప్రత్యూష' ప్రచురణము ౧౩

# నిర్మాణగానము

ర చ న

శేషుబాబు, బి. యే., బి.ఇడి.

ప్ర వే శి క

ఆచార్య కురుగంటి, యం. యే.

సాధన సమితి
సికింద్రాబాదు
(దక్షిణ)

అర్ధ రూపాయి

ఈ పుస్తకము దొరుకు విలాసము :—

1. రచయిత

చల్లపల్లి (కృష్ణాజిల్లా)

(via) మచిలీపట్నం

2. సాధన సమితి

సికింద్రాబాదు (దక్షిణ)

3. ఉత్తమాంధ్రగ్రంథవిక్రయశాల లన్నిటిలోను



పార్థివ — శరత్తు

నా నిర్మాణ పథముల
మంత్రపుష్పములు చల్లిన

నా తల్లికి
తండ్రికి
విద్యాశాలలకు
ఇతర
జాతీయ నిర్మాతలకు
అర్పితం



# ప్రవేశిక

గ్రంథకర్త సాధన సమితి సభ్యుడు. సాహిత్య సాధకుడు. వృత్తివలన ఉపాధ్యాయుడు. బాలుర చిత్తవృత్తిని బాగా తెలిసినవాడగుటచేత దేశభాషాభిమానాలు బాల్యంలోనే పట్టుపడితే ఫలప్రదమౌతాయని తెలిసి ఈ గీతావళిని రచించినాడు. వీనిలో ఆంధ్రదేశ భాషా చరిత్రాంశాలు తొణికిసలాడుతున్నాయి. కొన్ని స్థలాలలో శైలి కొంచెము క్లిష్టమైనా మొత్తంమీద రసవంతంగానే ఉన్నదనటంలో యెంతమాత్రం అభ్యంతరంలేదు. బాలవిజ్ఞానం నిర్మాణానికి పునాదికాబట్టి గ్రంథనామంకూడా సమంజసంగానేఉన్నది. వీనిలో కొన్ని భావప్రధానాలుగా ఉండి పెద్దవారికికూడా పఠనీయం ఈపుస్తకం. ఇవి వ్రాసినందుకు గ్రంథకర్తను అభినందిస్తున్నాను.

నాంపల్లి,
8—12—45.

కురుగంటి సీతారామయ్య

# గీతికా సూచి

## ప్రతిజ్ఞ

స్వాతంత్ర్యమే నిజప్రకృతియౌ నా పుట్టు పెరటియందలి గాలి పీల్చుచుండి
తలిరేండ్ల తియ్యకౌగిలి నంటుకొనియుండు స్వధరాంశువులు నొంటబట్టుచుండి
దేశసేవక జీర్ణదేహాణు సంకీర్ణభూమి పంటల రక్తమున్ రచించి
తొలియూర్పు రోదసిం దొలిసారి కన్విప్పినట్టి వెల్గునె మున్కలాడుచుండి
అమృతకిరణుని జ్యోత్స్నలస్నాతమయ్యు పులకరించని పశువులపోల్కి నుండి
మిథ్యావృతాత్మల; నిశ్వాసమెందుకో ఆకో తెలిసికొనుచుంటిమాశీర్వదించుమమ్మ.

# (జాతీయ నిర్మాణ గీతి)

వ్యక్తులేనోయ్ జాతి యనగా
బాలురేనోయ్ భావిపౌరులు
ఊయలూచే చేతిశిల్పమె
ఉర్విసెంతటి జాతియూ 1

నాతి చీకటిలోన మిగిలే
జాతి గతి కది పశుజాతము
అంబికేయును మాతృహృదయా
నర్ధగతి యని వినవటోయ్; 2

'జీజి' కడుపున నెగ్గు రఘునాథ్
జీ' లు కలుగుట సంభవించునె ?
మాతృహృదయము బ్రతుకుబాటల
మంత్రపుష్పము కాదుటోయ్ ? 3

బాలురైతే భావిపౌరులు
భావిమాతలు బాలికలురా
పురిటినుండీ జాతికోకరూ
పొసగవలె నని తెలియవోయ్. 4

వ్యక్తులను కావించి జాతి 'త
యారు' చేసే కర్మకారుడ
జాతి వివిధాంగముల 'జాతి
స్పర్శ' నొసగక వదలకోయ్! 5

మెదడు మెదడుకు వెలుగు నిచ్చే
ఉదరప్రశ్నాతీత యోగీ,
పాఠశాల స్వజాతి రచనా
భారవహునికె క్షేత్రమోయ్ ! 6

విశ్వకర్మ సహాయశిల్పి,
విశ్వగతి తొలి - వేగ - చక్రా,
నాదసహజ ! బ్రహ్మశాశ్వత !
పదకవీ, నీ బాధ్యతోయ్! 7

# మాతృగీతి



వందే మహాంధ్రజననీ । వందే స్వాతంత్ర్యధరణీ
ప్రథమాబ్ధి శాసనముషా ప్రాక్పశ్చిమప్రబంధా! ...వం

మగధస్థ శిరకిరీటా, ప్రాగ్గ్రీవాంసవస్త్రా
తంజాపురస్థపాదా, స్వస్వరూపాంధ్రమాతా ...వం

సర్వార్థగర్భయోషా! మకరంద మధురభాషా!
వేదాదిజాతి చరితా! దేవావాసయోగ్యా! ...వం

పశ్చిమపు పర్వతముల, పాతుకొనియున్న నిధుల
పెకలించి మాగృహాలవేతు నీ నదికరాల ...వం

ప్రాక్సింధు, కృష్ణవేణీ, గోదావరి, వంశధారా
మంజీర, తుంగభద్రా, పెన్నా, మునేరు మిషల
నావికా శిక్షణముకై ఉరమురము తీరములుగా
తీర్చావు కన్నతల్లీ, సుతు లన్న నెంత ప్రీతో! ...వం

చేపుదువు గోమధూళీ, నవధాన్య క్షీరధారా
ఈ పెదవు లిట్టు లెండ, ఆ పాత్ర లిట్టె నిండె! ...వం

రతనాలు నీసురాళ్ళు, నీ మన్ను మంచి పైడి
బిడ్డలకు మన్ను రాళ్లా చూపావు రొట్టె నడుగ? ...వం

విద్యుత్శక్తి పోనీ, తుద కన్నశక్తైనా
నిర్మించుకొనకపోయె, నీ బలగ మింతయుండే... వం

జల పవన శక్తులన్నీ, సంధించి, జనకజననీ
సకలాంధ్ర సామ్యధర్మ స్థాపనము చేతుమమ్మా. వందే
దిక్తటవ్యాప్త సుయశోమణి శిరోభూషణకాంతి
దిక్ప్రాశితకర కనకా ఘంటానినాద గీతి... వం

తొలి సుతులు నాడు నీకు మురిపెమున కట్టుకొన్న
పట్టుపెల్లాల తిరిగి వర్ణించనోతుమమ్మా... వం

కాలములనాటి ఆంధ్రవాయువులు నిలుపుకొనో
వెలుపింక మాయలేదే పల్నాటి కదిల నోదార్చ,
స్వేచ్ఛాతరంగములలో పరతంత్ర రేణు వూద
నీ సుతులు తిరుగనట్టి రోజసిని నించుమమ్మా... వం

ఒకటిగా మేలుకాంచి, ముక్కోటి తెలుగు తలలు
నీ పాదపీఠి నిలిపి, కంకణకరాలు మోడ్చి
సుత భావిశుభముకైనా త్యాగతపమున నిగా
స్వాతంత్ర్య స్తంభములై మంటపాల్ వేతావమ్మా!... వం.

# మాతృభారతి



ఒక జత చేతులు కౌగిలించుకొనె
మిగిలినవానినె జోడుచేసితిమి
శిరములు జతగా చేర్చివంచితిమి
కొనుమమ్మా మా నమస్కారమును.

హిందూ ముస్లిం సహోదరులము

ప్రకృతీ జెటియొక చేతనెత్తుకొని,
చెటియొక చంటిని చేసి చేర్చితివి
ఒకే ప్రేముడికి ద్వి ధాకృతుల మని
చెటియొక కంటను బుజ్జగించితివి

హిందూ ముస్లిం సహోదరులము

ఇరువురు కలిసిన రెండు కన్నులము
హృదయతామరకు రెండు వైపులము
తల్లి సేవలకు జత వారసులము
అద్వైతము మా ఇరువుర మతము

హిందూ ముసిలిం సహోదరులము.

......సౌభ్రాత్రము.

# ఋణము



నీ మట్టిలోనుండి । నిర్మాణమొందాను
నీ గాలి పీల్చుకొని । నిలిచాయి ప్రాణాలు.

పొట్ట బట్టలకు ఋణపడిపోయియున్నాను
ఈ శరీరములోని దంత నీ సొత్తే
నీ కొఱకె ఈ సొత్తు । నిలుపుదో పోస్తు.
ఋణమింత తీర్చుకోలేనట్టి నాకేల
మరణించువఱకిట్టు లఋణమైపోతాను
నీ యొడిని మరణించనయితినో అది చాలు
నపుడైన కాదనక కడుపులో నిలిపెదవు.

# నీవు



అమ్మవు నీవే ! అప్పవు నీవే!
ప్రాణం నీవే! మానం నీవే!
దైవం నీవే! ధర్మం నీవే!
నీవే లోకం! నీవే నాకం!
నీవే నేను ! నేనే నీవు.

# నా స్వర్గము



జన్మభూమి యొక స్వర్గభూమిరా
దేశజనులె నా దేవగణముగా ॥జన్మభూ...॥

పూలతీవెల, పాలతరగల
తల్లి కౌగిళుల పిలపించెడి సుఖ
వాతావరణము పలుకరించునా ॥జన్మభూ...॥

పట్టు తేనియల తుట్టెలవోలే,
చిన్ని స్నేహితుల చిఱుమొగమ్ముల
తేనె వెన్నెలల తీపి పిలుపులో
పిలుపు సీమ యొక స్వర్గభూమిరా ॥దేశజ...॥

దీర్ఘరాత్రులు దీర్ఘతమసులు
దుర్దినమ్ములును ఎఱుక లేనివై
జనసాంగత్యము దినదినవరమౌ
సౌఖ్యసీమ యొక స్వర్గభూమిరా ॥దేశజ...॥

ప్రతిబింబిత తారాభ్రపటముగతి
రంగుపుష్పముల రోచు లద్దిన
పట్టుతాపితా పరుపు పసరికల
క్రీడాభూమియె స్వర్గభూమిరా ॥దేశజ...॥

చిర శిశిరమ్ములు శీతవాహములు
గ్రీష్మ చిరమ్ములు నుష్ణగుండములు
కన్నులు నమ్మని కలనేలరోయూ ॥జన్మభూ..॥

పాలు తేనియల ప్రవాహతటములు
భర్మరత్నమయ పర్వత సీమలు
వసంత సుందరి వల్లెవాటు కోస ॥జన్మభూ..॥

# ప్రశ్న



ఎన్ని లోపములు ఉన్నను వానితో
కన్న నేల నిను మన్నించెదమే
లోపములకు నే ప్రేమించెదమే ॥ఎన్ని॥

'నీ దేశమునకు ఏమి చేసితివి
తాతా? —' అని నీ మనుమడడిగినచో
ఏమి చెప్పెదవు రారా? లేరా! ॥ఎన్ని॥

హిందూ, ముస్లిం కలిసి నిలిచెదము
మనసును ధనమును అంజలెత్తుదము
ప్రాణము లయినను వదలగల్గుదము ॥ఎన్ని॥

# కారణ జన్మ



లోకహితముల కొఱకు కలిగె నిమిత్తవజ్జాతి
తమోపహిత మహాకరద్యుతి ధర్మసంజాతి
పుణ్య వెలుగుల దేవగోత్రిక భారతీజాతి
భానిసీలుగ దీర్ఘకాలము బ్రతుక నీజాతి ॥లోక॥

వనధి నాలుగు కొంగు తెలిసి వర్త్య ప్రగతి
కలసలుగ సప్తాంబుధిద్వీపముల కరమెత్తి
విశ్వవిస్తృత ధర్మసామ్రాజ్యాధికృతి నొందీ
ప్రథమ సాగర మేఖలన్మై వఱలె నీజాతి ॥లోక॥

తాత తప్పుల కొరక శతాబ్దము దాస్యమున మ్రగ్గి
నిఖిల స్వేచ్ఛను గౌరవించుట నేర్చుకొనగల్గి
స్వాతంత్ర్యమై తన నెత్తురిలో సరిచెందు నీజాతి
అందుకొని వెలిగించి స్వాతంత్ర్యామరజ్యోతి ॥లోక॥

పైనబడిన శతాబ్దముల బడద్రోసి గమకించి
ప్రాక్ప్రభావతి ఫాలరేఖకు తళుకు సవరించి
విశ్వస్వాతంత్ర్యప్రవర్తగ వెలుగు నీజాతి
ప్రాక్ప్రతీచి వియ్యమొనరచవచ్చు నీజాతి ॥లోక॥

ప దు ను ప వు ఖ్గ ఖ

న

పు ట్టి నీకు జాతియుత నెలుగ రా

య

పోయె త్రుప్పు తుడవ

పుట్టినట్టి యట్టి నీకు జాతియుత నెలుగరా !
రా, ఖడ్గపు పదును పట్టిపోయె త్రుప్పు, తుడవరా !

నడివడి పిడివైపు నచ్చు కత్తి పిడికిలించరా
రాట్నపి, కోసతిరిగి. నడిమినత్తి మొత్తుమున్నరా !

విడివడి జడిమా ప్రవృత్తి, వీరవ్రతము పట్టరా !
రార, పట్టి కత్తిపిడిని, జనని కనుల వెలుగరా !

దొరుకదు పరులు బలి కాత్మరక్తమైన వాడరా!
రా, పదునువెట్ట నెత్తురుకే వాడగవలయురా !

అల్లి తొల్లి తల్లిచనుల పాలదెంత కాగెడిదో !
దోఃస్థిత సుతు నెత్తురి తల్లిసేవ కెంతపొంగెడిదో !

ఒర నిరకర కోట్ల సహజ కరవాలము లొకటిగా !
గాటుకు జగమెల్ల వెరచి, కనులు దించుకొనునుగా!

— కాలప్రబోధము

# చరిత్ర



జాతి ఉన్నతికి సాగిన వేళల
వ్యక్తులు చూపిన శక్తులకు
జాతి అపనతికి జారిన వేళల
కలిగిన పొరబాటుల కొలతకు
　　　　జాతి చరితలో పుటలు త్రిప్పరా
　　　　వ్యక్తిచరితే జాతిదిగ చేయరా
పక్షవశీభూతున నొకని చేతిలో
జాతి యదృష్టము నిలుచు వేళలో
రచియించుకొనే నిజచరిత్రయే
ఆ జాత్యర్క స్వాయి చెందునే
　　　　జాతి కృతజ్ఞత ఎంతవారికిర !
　　　　స్వార్థచరిత జాతిదిగ చేయర!
రాజులె ఇతిహాసములు ఘటించి
ప్రజలు చరిత్రవిహీనులు కాగా
‘చరిత్ర తిరుగుచు నుండ’ కేమిరా ?
జాతిని వ్యక్తికి బలినోసంగకా
　　　　ఇతిహాసోపకృతిని పొందరా
　　　　ప్రజాయుగమునకు శ్రీ రచించరా.

# తూర్పువైపు హెూ!



కాలచక్రగతి కనరా, లేరా!
బంతిపంపూవంతు వచ్చె కనరా!
తిరిగి తూర్పున కాంతి ప్రభవించునలెరా!
నిదుర మానాకున్న, నిదురే గతిరా!

విశ్వమెల్లా తూర్పు చూచేరా!

భావిభాగ్య కారకుడ వీవేరా!
కడగొట్టు గారాబు తనయూడ రారా
మాతృ పంచమప్రాణధనుడ వీవేరా
దేశసర్వస్వంపు టాశా, రారా!

నీవే నిదురించ నిం కెట్లురా?

కనుమూతలో చీక టనగ నదియెంత?
అందులో కలిగేటి నిద్రసుఖ మెంత?
వెలుగు వెల్లువ చుట్టు విరబోయుచుండ
నిద్ర మరిగే జీవి బ్రతుకు విలువెంత?

వైతాళికుడవో, లేరా!

# పరతంత్రము



ఒకరుపెట్టే తిండి కొడబఘుట కర్మరా,
ఆత్మసంపాదనము ననుభవించాలిరా
రక్తమును పారతంత్ర్యమున రచింతురా,
భారతా,
ఒంటలేని స్వతంత్ర మింట నెట్లుందురా?

పరతంత్ర జీవితము స్వామిభక్తిని పెంచు
స్వాతంత్ర్యపు బ్రతుకు స్వాభిమానము నించు
కృతవిజ్ఞతావాతిక్షుభిత జీవిక వలదు
భారతా,
సమయమున కెప్పుడైన చావనైనను పడదు.

# భ్రమరగీతి



పుట్టలో చీమవా పుట్టిన ట్లరుగుటకు ?
పుష్పునేలను బ్రమఘుపోక లగుపించాలి.
నీ చేతిలో దివ్వె నిలవాలి తారగా!
నేల కథ నొకటిగా నిలవాలి నీగాథ!
బ్రతు కొక్క జీవనదిపాటగా వెలవాలి!
చిరవాయువుల రవళి జేరి, స్వనియించాలి! ॥పుట్ట॥

# శిరోరత్నం



మణికెంపు కనిపించి, మకుటాగ్రమున నుండు
కొన్నాళ్ళు కులుకుతూ..... ఓ ప్రభూ,
భూభర్త తలకెంపు కిగిరించరా, ఫణిరాజు
మకుటాగ్రరత్నమ్మురా !

ముకుట మహామణి పొగవెళ్లుచుండేను
పొగవెళ్లి, పొగవెళ్లి, భగభగా మండేనా !
చేచేత విదిలించరా ఓ ప్రభూ,
నరు ఎత్తు కది మించురా !

రాయరాయుగ గర్భరతులొసంగి, యొసంగి,
మిగిలిన ఎమ్ములో రగులునో కార్చిచ్చు !
కడుపుచిచ్చింద్రించి, బలికోరురా !
ఓ ప్రభూ !

పుత్రానుభవనీయ స్వాతంత్ర్య డోలికా
స్థగితార్థయోగ్యరా ! నీచమానవ పాప
దళనదమనత్రాణ సంత్రాత !
త్రాణభారము దించరా !

# క్రీడాగీతము



( గుఱ్ఱపు కఱ్ఱ - ఆట )

ఉర్ కర్, బఢ్, బఢ్, ఉత్తమాశ్వమా!
చల్ చల్ చల్ చల్ జంగ్-కా-ఘోడా! ॥ఉర్ కర్, బఢ్॥

కాశీమల్లి కీలుగుఱ్ఱమా,
తాతల తలవలె తరుగు తురగమా!
తాతల శౌర్యము తలపించెద నే ॥ఉర్ కర్ ...॥

ప్రతాపరాణా ప్రసిద్ధ 'చేటక్'
జాతికి చెందిన 'జాతితురగమా,
ఎక్కిన రాతును గుర్తించగదే ॥ఉర్ ...॥

గౌతమవీరుని 'కంటక్' ఘోటక
రక్తము కాదా రాచతురగమా,
పైగల వీరుని బట్టె కదలవే ॥ఉర్॥

ఛత్రపతీశుని జయకారణమా
'భవాని' హయము స్వద్యాభత్మకోటివే!
మూపున వీరుని పొత్తియె లేదా? ॥ఉర్ ...॥

ఉచ్చైశ్రవగోత్రిక ఘన హయమా,
దేవజాతిలో నొదవి యుంటివే
ఉత్తమాశ్వికుని హొయలు తెలియవా? ఉర్ ...॥

పారసీక 'రఖ్షా' జాతదిగో
హుంకరించి, సకిలించి ఉరుకవే
భారతీయతను చాటి నిలుపవే ॥ఉర్ కర్॥

# చందమామ



బిడ్డ :

చందమా మెందుకే
మందహాసమె చేయు
నెవ్వుడూ ఏమోను
చెప్పున ట్లుంటాడు
వెన్నెలల మొగమే మొం
చిన్నబుచ్చేస్తాడు ?
అమ్మా,
చందమామకు, నాకు
సంబంధ మేమొ?

తల్లి :

చందమామని నీవు
చక్కగనె అన్నావు
తెలుగుతల్లిని నాకు
కులుకు తమ్ముడు వాడు
బెంగెట్టుకున్నాడో
మేనల్లు నినుచూచి
బాబూ,
చందమామకు కళలు
సరిగ సవరించరా.

# క్రీడా గీతము

(ఆటల్లో సంకీర్తనం)

ఒకటవ అర్ధ స్వరమేళ :

అమ్మ ఒడిలో హాయి యెరుగుదువా ?
పూలతోటల కౌగిలి తెలియున ?
మలయానిల లాలన గరిగితివా ?
జలతరంగముల గిలిగింతితివా ?
తల్లి ప్రకృతి ఒడి నాదేమా ?

రెండవ అర్ధ స్వరమేళ :

వెలుగు కరములు చాచెర తల్లి,
తేనె - కోయిలపాటలం బిలిచే,
మొయిలు తురగాల్ పనిచే తేరా !
ముసిలిం, హిందూ సహజుల జూచీ
చెలియొక కంటా కప్పకొనేరా !

ప్రథమార్థ స్వరమేళ లో ఒకరు :

బంగారపు కడియముర కనరా !
పూర్వ మిచ్చో మట్టె కదరా !

దాగుడు మూతల నాడరారా!
తొక్కి, ఎక్కి, గెంతేమేరా?
అమ్మ నేలా ఒళ్లో పడరా!

ద్వితీయార్థ స్వరమేళలో నొకడు:

ఆత్మతోనే దున్నెనో ఏమో
నుదుటి చెమటే దుక్కి తడిపెనో,
కండ కరిగే బలము చేసెనో,
కళ్లతోనే పెంచుకొనెనో!
ప్రాణశక్తికి రూపొసగెనురా!

ద్వితీయార్థ స్వరమేళ అంతయు:

స్వీయమాంసము నరిగించుకొని,
గింజగింజకు రక్తము నొసగీ,
ప్రాణములనే రాసులు పోసే
ప్రాణములతో చెలగాటమురా!
గింజ లెముకలై ఎదలో నిరుకునో!
కృషి దేవీ స్థన్యామృతసరసీ
కెలకకు డేజన్మకృతఫలమో!
'పండ్లు వి త్తీ, పలుగులు కోసే
గడ్డ' మీదను పుట్టితి మనలే
కోతికోమ చ్చాడగ లేమా?

రెండర్థ స్వరమేళలు: అమ్మ ఒడిలో......॥

# జోలపాట



... ... ... ... హాయీ.

ఈ ఊపు ఊపుచూ నే పాడు పాట
నీ పసినెత్తురులో నెలకొనునుగాక
ఈ గాలితరగలో ఈ పాట నిలిచీ
శ్వాసశ్వాసను బ్రతుకు శాసించుగాక ...హాయీ.
ఊరుకో విద్యాపుర ఓరుగల్ కథలూ
పల్నాడు, బొబ్బిలీ పౌరుషా లన్నీ
స్మృతిపథమ్ముల జేరి, సాక్ష్యాదో తండ్రీ
తల్లిభూమిని నీవె తరియించవలెరా...హాయీ.

కృష్ణరాయ, ప్రతాపరుద్ర కుంజరులు
నాగమ, మల్లమా నారి సింగములు
ఊహాలో కొచ్చెనో ఉలికులికి పడుము
కనులు నీపైనుంచి కలదురా తల్లి...హాయీ.

ధీమాన్ యుగంధరా తిమ్మరుసులాది
బ్రహ్మన, మాదనా ప్రజ్ఞావిశేషుల్
మెఱసిన నీజాతి సురవర్త్మ మందూ
మూసిన చీకటుల్ పోకొట్టవలెరా...హాయీ.

ఆసేతు వింధ్యాచలాంధ్రరాజ్యమునా
వంగ, యువన తటాల వైజయంతికలు
కలగాంచితో బాబు ఖంగారు పడితీ
భావికై నిను నమ్మి వఱలురా తల్లీ...హాయీ.

అమరావతీ శిల్పి హస్తనైపుణులు
నాగార్జున ధరాధర శిల్ప ఖనులు
ప్రియ అజంతా శిల్ప విన్యాస విధులు
తలపునకు వచ్చెనా! తండ్రీ నా బాబు...హాయీ.

థేమ్సులో నీ నౌక తేలిన దినాలు
సీమలో నీ దుస్తు సింగార దినము
సీజర్లు నీ సఱకు గని మురియు దినము
త్రవ్వుకొనుచుంటివో తలకుచున్నావు ..హాయీ.

తెలుగుజెండాలతో తెలుగు నౌకలను
క్షుత్క్లాంతి యొకచేత, తృట్క్లాంతి యొకట
తెలుగువలసల లోన దించిన దినాలు
జ్ఞాపకము వచ్చెనా! కన్న నా తండ్రీ!...హాయీ.

నీ పోటు కండరాల్ని పొంగు నెత్తురు
ఈ నీ శరీర నిర్మాణపు కణాలు
మన యుద్ధఱకు నేక మాత భారతికే
నీ జీవితము మ్రొక్కుకొంటిరా పుత్రా!...హాయీ.

అన్యుల కీర్ష్యనీయస్థలిగా నిలిచీ
నీ జాతి యొకనాడు నింగి తాకినచో
ఆ నాళ్ళు తలచుకొని అటమటించెదరా ?
నీజాతి నీతిని చాటి నిలపాలీ... హాయీ.

పుత్తడి పంటలా భూమి గర్భమ్ము
పాలతో, తేనెలతో ప్రవహించు పొలము
కలుగు నీ భూమిని కలిగెరా కఱవు
కఱవు దీర్చెదనంచు కలదురా తల్లీ... హాయీ.

నా కెంత యనియేమొ నవ్వెదవు, కానీ
ఉగ్గులో నే నిచ్చు నుత్తేజ మెల్లా
తరుగకుండాలిగా పెరిగినను కానీ
తల్లి ఋణమును దీర్చు ధన్యతను గనుమీ... హాయీ.

ఒడలంత నెత్తురే ఉడుకదైనానూ
అసువు లున్నవి కాని అర్పించ లేగు
సబ్ధతయే జన్మతత్త్వమైనాదీ
వెలిగించవలె వారి వీరజ్యోతులనూ... హాయీ.

నిదురలో కనుబొమల్ నిక్కించుచుంటీ
అమ్మమాటలు నీకు అర్థమైనవియో
ఎన్నిజన్మలనుండి మన దాంధ్రజన్మో
గాలి పీల్చుటలోనె గ్రహియించినావూ... హాయీ.

బాబు… … …. పేరు పాపలకు పెట్టి
దేశావసరములకు తేకువలు గలుగ
దీవించుకొని, పిల్చుకొనవలెర భువిని
నీ బ్రతుకు తల్లికై ముడుపుకట్టుమురా… హాయి.

## ఆత్మ



అమ్మయొక్క ఉగ్గులలోన
అప్పయొక్క ఒఱవడిలోన
ఆచార్యుని బోధామృతమంత
ఆత్మయొక్క ఆదేశములో
పూసినట్టి దేశప్రేమ
దేహాణువులను దీపించింది

నా దేశం భారతదేశం
నా పేరు……….బాబు.

# మేలుకొలుపు



కన్నతండ్రీ! నిదురలేరా, చిన్నబోయె చీకటిల్లు,
నీకు ముందే నిదురలేచి, తల్లికనులు వెలుగజేయు
సూర్యు మొగమును చూడలేవూ ॥కన్నతం॥

తల్లి ఉషసీ నల్లముసుగు, తొలగగానే కరము లెత్తి
తన్ను నెత్తుకొనుమటంచు, కళ్ళు విప్పి కాంతులన్ని
పారబోసెడి, నీవురా? ॥కన్నతం॥

నీవు ముసుగు పెట్టినంత, రాత్రిదీపాల్ పెట్టినామూ
ఇంటిదీపము బాబులేవక, రేయిదీపము నార్పుటెట్లు?
కొండదీపము సాటిబాబువి! ॥కన్నతం॥

అమ్మ ఒడినీ విడువకుండనె, గోళములు వెలిగించు సూర్యుడు
బాబు లేనీ లోకములకు గ్రహణమే ననునట్టి సుద్ది
కన్నకళ్ళకు చూపరా! ॥కన్నతం॥

బాబు వెళ్లక బడియె తెఱువదు; భాయి, బ్రదరు బడికి రారు
గంటవేళకు గంట మ్రోగదు; గురునిముఖమున వాణిపలుకదు
చిన్ని పొత్త్రాల్ పట్టరా! ॥కన్నతం॥

నిదురలేచి, నిన్నుచూచి, ప్రకృతి మొగము చూడనెంచి,
కళ్ళునూసి, కరము జాచి, కన్నతండ్రి అక్కొ పిలిచెడి
లేవమందము, లేవరా ॥కన్నతం॥

మేలుకొలుపులు పాడు పక్షులు, మేనుతట్టి గంధవాహులు
లేచి నీకై అపుడె వచ్చిరి, భాను, బ్రజనుల మేలుకొల్పి
వాడ వీట్లల నున్న నెల్లు?... ॥కన్నతం॥

## తెలుగు బాలుడు



బాలుడైతే నేమి తెలుగైననే చాలు
తెలుగునెత్తురులోనె ఎంతైన కలదు
సింహ మెక్కి సవారి చేసినవాడు
శాతవాహనుడైన తెలుగు బాలుడె ॥బాలు॥
పంతాన నరసింగు తల తెచ్చినట్టి
బాలచంద్రుడు కూడ తెలుగు బాలుడె ॥బాలు॥

# నాటి తెలుగు తల్లి



తొలినాటి తెలుగులను
తల్లులే పెంచిరో
శాలచంద్రములు, శాత
వాహనులే తోచెదరు!

జాతి జీవిత గీత
చరణములతో బ్రతుకు
'భ్రమరికా ఫణితి'లో
పాడి కావించిరో ||తొలి||

ఎడద నాళములలో
నుడుకు రక్తములపై
తేలు నా తెలినురుగు
పట్టికుడిపిరా ఏమొ ||తొలి||

మాతృభూమీ వక్షు
మకరందముల నయిన
కంకి-పాయసములే
కడుపు నించిరా ఏమొ! ||తొలి||

మధుర జాతీయతా
మకరందముల యుగ్గు
కత్తిమొనతో నెత్తి
కడుపుకుంచిరా ఏమొ ||తొలి||

వీరకవిత కథలు
వీనులను మథియించి
నిగ్గుగా బ్రతుకు లటు
నిలువ దేల్చిరా ఏమొ ||తొలి||

పోగులుగ బారలే
పోసి, నేసిన చేతి
పొత్తి కౌగిలి వెచ్చ
నొత్తి లాలించిరో ||తొలి||

ప్యూహా, దుర్గ, సులక్ష్య
యుద్ధపరివృత్తములె
క్రీడా విధాల్జేసి
క్రీడించ నేర్పిరో... ||తొలి||

# ప్రథమాభిశాసకులు



★

మధ్యధర రేవుల్లో
'అలిక్జాండ్రియా'లో
గొప్పరకపుటోడ
లంగరేసింది—
దానిగూర్చి 'రోము' నేలు
'సీజరు'కు తెలిసి
'ఈ కడలిశాసకులు
ఎవరో?' అటంచు
'ఎవరిదా అటు తేలు
ఊర'ంచు, తానె
'ఈజిప్టు' 'టోలమి'ని
వెంటగొని, దాని
'నఖూద' ఆజ్ఞ సం
పాదించి-లోన

మోటుపల్లి వారి
ముత్యాల వీథి
'భరుకచ్ఛ' పట్టుకే
చ్చెడమమ్ము సీమ
'మనరప్ప' సీమ 'మా
ల్లెస్ల'మ్మచోటు
శ్రీకాకుళం వంత
శిల్పాలతట్టు
దంతిపురపు సుగంధ
ద్రవ్యాల వాడ
క్రొత్తపట్నం ఓడ
పనిముట్లకొట్టు
మచిలిపట్నం వారి
'మారక-కచేరి'

'పుంజారి' వెంట జని, చూచి చూచాడు
'ఆంధ్రభారత నర్సపురకృత'మ్మనుచు

4
ఎగుప్త లిపి చూచి శిరము వంచాడు
కనపడే జెండాకు కరము లెత్తాడు
శతకర్ణి భూపతికి స్వస్తి పలికాడు
ఆ ఓడ 'మాలిము' ల ఇంటిపా టిద్ది
ఆ ఓడ మాలిముల మనుమణ్ణి నేను.

# అనుబంధము



తల్లి చన్నుల నుండి పడిపోయినట్లు
తేళ్లు కన్నుల లోనికిన్ ప్రాకినట్లు
దేశాంతరావాస మెద జలదరించు ॥తల్లి॥

గళము కత్తిన కత్తి హారమైనట్లు
పైకిపోయిన యుసురు లట్టె దిగినట్లు
పునరాగమన మెంతో తీపిసుఖ మిచ్చు ॥గళ॥

నిరత మధుఋత్వానుసరశీలి పికము
జన్మభూగత ప్రాణధర్మ మీ మనము
మన్ను మన్నున నిల్పుకొను కోర్కె హెచ్చు ॥ని॥

మాతృగీతి

# తెలుగులు



తెలుంగులయినా చెలియలు వినరే
తెలుంగు దేశము చరితము వినరే
తెలుగుల వెలుగులు కనరారే ॥తెలుంగు॥
దక్షిణభారతదేశ రక్షగా తెలుగు పతాకలు నిలిచాయే
నీడఁజేర్చి సుఖపెట్టాయే ॥తెలుంగు॥
ప్రథమ సముద్ర శాసన మిషతో
తూర్పుపడమరలు కలిశాయే, సంస్కృతియాత్రలు జరిగాయే
॥తెలుంగు॥

తెలుగు కవనములు తెలుగు వెలుంగుల
తీయబఱచి తెగజిమ్మాయే, తీపికి హద్దులు తీర్చాయే ॥తె॥
వేదారణ్యాంతఃపథదర్శక విద్యారణ్యుడు మనవాడే!
మేధోజ్జ్వలమణి మాం వెలుగే ॥తెలుంగు॥
మగధలోన మా జెండా నిల్పిన
హాలవంశముది మనజాతే! మాలో నెత్తురు లప్పటివే ॥తె॥

చతుశ్శైల శిఖరమ్ముల నెక్కి
తెలుగు తేజమును దిక్కులఁ జాటిన
రాయలు చరిత రచించాడే ॥తెలుంగు॥

# సంక్రాంతి గీతం



చందమామ! చందమామ! ఓ చందమామ!
చందమామ కన్నతల్లి జంగమాలగడ్డ
జంగమాలగడ్డపై - నిత్యదినసీమ
నిత్యదినసీమలో - నీలాలవఱద
నీలాలవఱదల - పచ్చలపైరు
పచ్చలపైరుల - బంగారుపంట
చందమామ! చందమామ! ఓ చందమామ!
బంగారుపైరుకి - పంజరాలకాపు
పంజరాలలోచిక్కి - మూతవడుకళ్లు
కళ్లలోమెఱుపులు - పల్లవించుతార
తారల్లతపసులు - తనియించు మామ
చందమామ! చందమామ! ఓ చందమామ!

# కృషిగౌరవం



తిన్న తిండేమైన ఇముడవలెనందురా?
మన్నవలెనందురా మన కట్టుకొను గుడ్డ?
దీపముంచిన దివ్యవేళల
'అమృతమస్త'ని అనెడి వేళల
పాటరి ఋణములు మిగులని ధైర్యం
పాటరి మేలును మరువని హృదయం
ఉండచూచుకోవలెనండోయ్!
మానవత్వ మేమర కండోయ్!

అన్నమును బుట్టించు దొర కృషికు డంటరా!
వస్త్రమును గలిగించు దొర పాట రంటరా!
వారి యాకలిని చూచేముందే
వారికి దణ్ణం పెట్టుకొనకనే
'అమృతమస్త'ని అన్నావంటే
'ప్రాణాహుతు'లను పట్టావంటే
పానజలము రక్తము సుమ్మోయ్
తిండి ఎముకలా రాసేనోయ్!

కడుపులు కొట్టిన బంగరు కణికలు
కాటిని ప్రోవుగ చేసిన యెముకలు
శ్రామికాస్థుల దనువు పెంచకు
శ్రమికు నెత్తుట కడుపు నించకు
పరిశ్రమా గౌరవం నిలబెట్టకుంటే
'కష్టే - ఫలే' సూక్తి దక్కించకుంటే
ఆ పోకడ జయమువబోదోయ్
శ్రామిక ఋణమున పోబోకోయ్ !

మొట్టమొదటి నరుడు తెలచూపిన వినాల
శ్రమిక రాజ్యమే భువిమీఁస కలదంట
సోమరింద్రుడకు గతులు లేవట
ప్రకృతిగతులకు చెఱుపు లేదట
వడి 'కృషిరాజ్యము' తేవలెరా
అర్హ్యనలినే కలిమి చేర్చరా
ఆ పోకడ జయ మవుతుందోయ్
శ్రామిక గౌరవ ముంచాలోయ్!

కృషిక గీతం—(ప్రజామిత్ర)

# కష్టార్జితం



చెమట సొమ్మే సొమ్మురా, స్వార్జనమ్మే పంటరా
నుదుటిచెమటను నూర్చుకొనియే భాగ్యమే భాగ్యమ్మురా॥ చె॥

చెమట పోసీ పెంచుకొనక, ఒడలుదాచుకు, ఉన్నదానినె
నమలి, జీవిక వెళ్లబుచ్చే, 'పుట్టు శ్రీ'అది గడ్డిరా॥ చె॥

చెమటపోసీ చేసికొనుచు, ఒకరు పేర్చేబడలికష్టము
నోటిముందుది ఊడ్చుకొనియే దోపిడీ అది నెత్తురురా ॥ చె॥

గడ్డితిని, బ్రతికేవి పశువులు, నెత్తురుపై నిలిచేవి మృగములు
ఆత్మకష్టార్జితము అన్నము, అమృతసృష్టి కదా ॥ చె॥

మూలధనములు మూల్గుచున్నా, ప్రజల కొఱకై ముడుపుకట్టె
చెమట టోపీల్ కుట్టుకొను 'ఔరంగజేబు'ను తలవరా ॥ చె॥

# శ్రమిక గీతం



పాటుపడుమురా! పాటుపడుమురా!
మేనువంచి, నుదురు తుడిచి, ముద్దవెత్తరా ॥పా॥
కృషికష్టము నరమాంసము చాలవిలువరా!
ఎత్తు కెత్తు చెమట పోసి, రొట్టె కొనుమురా
పాటుపడుమురా, పాటుపడుమురా!
నూలుతీసి, ఖదరునేసి, మేని కిడుమురా
నెత్తురిపోసి, చెమట పోసి, నేసికొనుమురా!
ఆత్మకృషిని, విలువయొసగి, బట్ట కొనుమురా ॥పాటు॥
పరిశ్రమా ప్రసాదమెపుడు బలిని గోరురా!
ఆత్మ బలి నివేదనమున అందుకొనుమురా ॥పాటు॥
సోమరీని మైల సోకనీక చూడరా
శ్రమపవిత్ర జీవియొక్క మందిరమ్మురా ॥పాటు॥

# అన్నగానం



యువకామినీ గాన మత్తహృదక్తితో
యువకవీ, ఇంకెంత కలవరింతువు గాని
అల్పభుక్తసహోదరార్తరక్తినో కింత
పలవరింతిము లేవరా!

నిర్గుణేశ్వర భక్తి కష్ట సాధన యేల?
సగుణప్రజారూప జననిభూ భుక్తికై
భువికవీ, భక్తితో కలము, కంఠము చేసి;
అర్థసాధన గాంచరా!

ముక్తియంచు నగోచర స్వార్థఫలముకై
జనకవీ, ఒంటిగా తపమేల? జపమేల?
జనపథములో నిల్చి, శంఖ, కంఠము లెత్తి
జరరముక్తిని జూపరా!

ఉదరకీలల నార్పు నిశితాగ్ని జ్వాలనకో,
బాధోపశాంతికో, నీగీతి తోడ్పాటు,
జనకృతజ్ఞత పొందునాడురా నీజన్మ!
జన-వీరు డయ్యెదవురా!

5

# ఆత్మ సంగీతము



నాపొలముల నాకరముల ఫలియించిన ఫలితములో
రొదవించిన సౌభ్రాత్రవంశ కదలించదా మాతృగీతి ॥నా॥
నా కరముల నేసికొన్న వస్త్రములో పులకించెడి
మొదస్పందన తాళధ్వనితి వినిపించదా జననిపదము ॥నా॥
నా పితరుల సంస్కృతిలో మ్రోసిన నా హృద్విపంచి
ఏ గాలికి కదలిదైన స్వనియించదా జాతిగీతి ॥నా॥

# సవరణ



ప్రపంచ ప్రాక్తటిలో, అను రోషస్వినికీ
పదములకు
లస్కు దీర్చుటకు రక్తమె కార్చారో
తెలుగులటు
విశ్వ తమస్వినికీ వేగుగీతులల్లురో ॥ప్రపంచ॥
సిరికి బాష్పములతో చెయగుచుంట కనవో
జ - ని — లా
తూరుపార్ద్రిరేఖా, పుత్రికుల భాగ్యరేఖా
తెలుగులే
రక్తమొగ్గలౌగా! తిరిగి అలదవలెరా! ॥ప్రపంచ॥

# తత్త్వము



జాతిప్రేమకు పైకి ఎగురలేను !
స్వజన సంగతి నసలె మిగులలేను !
జాతీయతాధునుల సుడులు తిరిగేను ! ॥జాతి॥

పాలబందము లెట్లొ త్రెంచుకొనును
పూలబందము లైన త్రెంచుకొనును
గాలిబందము లేమి త్రెంచుకోలేను ॥జాతి॥

ఇంటివారల కొక్క యోగి నేను
అవిశాల హృదయుడను అవనిలోను
జాతీయతా డోల లూగి, యూగేను ॥జాతి॥

స్వాతంత్ర్యపుణ్ బ్రతుకు బ్రతుకవలెను
ప్రాణమైనను కడకు విడువవలెను
రాణాప్రతాపు భువి నవతరించాను ॥జాతి॥

# పర రక్త భుక్



కాలే కృషికుని కడుపు గ్రీష్మముల
కార్చేకృషికుని ఘర్మవర్షముల
నేర్పడు కంకుల, జేర్చె క్రొవ్వున
వెన్న డగ్గికల్ వెలువడునో

   

పచ్చని పంటల పరువము పీల్చెడి
ముచ్చుపురువులే హీనంబో!
రైతు - సంఘు - తను - రక్తము బీల్చెడి
రాతు బ్రతుకె హీనంబో!

# తెలుగుతనం



ఆ మురళి చేఁగొనకురా
ఆంధ్రుడవు
శంఖారవము చేయరా
నిద్ర జోగొతుందిరా
ఆ మురళి
శంఖాన్ని చేదాల్చరా!

*　*　*　*

బాలికలు ఆడేదిరా
బాలుడవు
ఆ ఆట మానేయరా
తెలుగాట లున్నాయిరా
అవి గొప్ప
వీరుల్ని సృష్టించురా!

# ఆనాడు



మాధర్మ మేగంట నేమూలా మ్రోగేది
మాధర్మభువి నినుడు అస్తమించని లేదు ॥మా॥

మా సంస్కృతి జ్యోతి తోరణాలల్లితిమి
అబ్ధి యంచుల ధర్మ కేతనా లతికితిమి ॥మా॥

మధ్యమెరికా లోని మయచిత్రశాలల్లో
ఈజిప్టు భూకుహర ఋష్యాశ్రమాలలో ॥మా॥

ప్రాగ్భారతద్వీప భరతసంగతుల లో
చీనా జపాన్ బౌద్ధ జీవితపథాలలో ॥మా॥

యువన రోమక నాగరికతా ప్రసవంతిలో
లిథ్యూనియా కణ్వ సాంప్రదాయాలలో ॥మా॥

ప్రాగ్విశ్వభారతీ కాంతి కిరణాలలో
ధ్రువతారకాది నక్షత్రలోకాలలో ॥మా॥

# తెలుగు



నీ రక్తమున కలదు తెలుగూ
తెలుగులోనే కలదు వెలుగూ
పొనుగువడియున్న దా మెఱుమూ
నివురు లూదెద పాటపాడీ... ॥నీరక్త॥

# ఏకమేవ ....



పాడెదా, పాడెదా, పాటలుపాడుచు బ్రతికెదా
భారతీ పదము పాడెదా! భూమి యంచులకు మ్రోసెదా ॥పా॥
ఆంధ్ర లేదు, మఱి ఓఢ్ర లేదు, భారతియె సర్వమనుచూ
భారతీ పదము పాడెదా ॥పా॥
హిందు ముస్లిముల మేకజాతికే రెండుప్రతుల మనుచూ
ఐక్యగీతమును పాడెదా ॥పా॥
రాజుకాని మఱిరైతుకాని చక్రమున నాకులనుచూ
జాతిగీతమును పాడెదా...॥పాడెదా॥

# స్వాతంత్ర్యోత్సవము

యూపమున జో గంటిరా! ప్రా
భాత వార్తావహుడవై యో
భ్రమర బాలక! నూత్న గీతుల
లేపవచ్చావా ?

చిలుక బాలిక! చెట్లకొమ్మల
చేరి, స్వాతంత్ర్యాగమనమును
ఏలపల్కుల మంగళాగత
మీయవచ్చావా ?

చక్రవాకీ, నీవునూ స్వే
చ్ఛాస్థితి కారతి నెత్తవచ్చావా ?
పరభృతా, స్వాతంత్ర్య దినకై
వార మిచ్చేవా ?

ప్రాతరోత్ఫుల్ల సుమరస మ
ధ్వార్చనల శాఖాంగనా, ప్రా
క్తీర స్వేచ్ఛావాయువున శా
తిథ్య మిచ్చేవా ?

కేకినీ స్వాతంత్ర్యలక్ష్మిని
కేలుపట్టిన క్రొత్త పులకల
పురి విదిల్చి స్వతంత్ర నాట్యము
పూనుకొన్నావా ?

వెలుగు-జండా విచ్చి పట్టుచు
వేగు-వై తాళికుడు వచ్చిన
చిగురు తోరణములను నిలబడి
చీరనున్నారా ?

## ఆంధ్రవాణి

౦

మధుర మంద మకరందపదామృత పరివాహీ
విధురుచి మధు ముక్తాక్షరమా లోపరివాహీ
విశ్వవాణీ, మనోజ్ఞ మహాంధ్రవాణీ ॥మధుర॥
ముద్దులొలుకు హంసధ్వని మాటకట్టుదే
వాణి
పంచకళ్యాణి నీవు లొలుకపోయుదే ॥మధుర॥
జాతిభావదీపకోజ్వల ప్రభామహోన్వితా
ఆంధ్ర
పదపదామరారుణజ్యోతిరుద్ధృతా ॥మధుర॥

---